Regd. No.
H. NL. 18
సంపుటి: 56
సంచిక: 7

# జమీన్ రైతు

15-2-85
శుక్రవారం
14 పేజీలు
75 పైసలు.

స్థాపకులు : నెల్లూరు వెంకట్రామానాయుడుగారు
సంపాదకుడు : నెల్లూరు శ్రీరామమూర్తి

# 'ఎవడబ్బసొమ్మని' ఈ పందారం?

ఆపద్ధర్మ ప్రభుత్వ ముఖ్యమంత్రి పచ్చినియంతగా తన రాజకీయస్వార్థం కోసం ప్రభుత్వ ఖజానాను కొల్లగొడ్తున్నారు. "ఎవడబ్బసొమ్ము" అని కేంద్రప్రభుత్వంపై అనవసరంగా నోరు పారేసుకుంటున్న ఈ పెద్దమనిషి "ఎవడబ్బసొమ్మని" తాను రాష్ట్రప్రభుత్వ నిధులను పందారం చేస్తున్నారు? ఆ

**మా రాజకీయ పరిశీలకుడు**

ప్రశ్న అడిగేవారు లేరనేగదా అతని ధీమా? అడిగితే ప్రజలకోసమే పీఠంలో "శక్తిపాతం పాటించవచ్చు" అనేగదా అతని ధైర్యం? ఈ తంతంతా కేంద్రం తెలిసికోలేదనేగదా అతని భరోసా? అమాయకులు, అవిద్యావంతులు, సినిమా పిచ్చితో కొట్టుకపోయే సామాన్య ప్రజలను మోసపుమాటలతో బుట్టలో వేసుకోవచ్చుననేదేగదా అతని సాహసం?

కాని విద్యావంతులున్నారు: మంచి చెడు విచక్షణ శక్తి గలిగినవారున్నారు: పరిస్థితులను అర్థంచేసుకోగలిగినవారున్నారు: రాష్ట్రం ఏ దిశగా గోతిలో కూరుకుపోతున్నదో గమనించగలిగిన వారున్నారు; పార్టీలకు అతీతంగా రాష్ట్ర శ్రేయస్సును కాంక్షించే వివేకవంతులున్నారు; రామారావు తన స్వార్థానికి, ఓట్లకోసం రాష్ట్రాన్ని దివాలా తీయిస్తుంటే అధికారాన్ని సంశయంలేకుండా దుర్వినియోగం చేస్తుంటే అడగగలిగినవారున్నారు. వారి మాట ఈనాడు నిస్సారంకావచ్చు, నిరుపయోగం కావచ్చు, అరణ్యరోదనం కావచ్చు: తనమాట చెల్లుబడికావచ్చు: కాని తాను ఏ ఆరుకోట్ల ప్రజల పేరు చెప్పి విర్రవీగుతున్నాడో ఆ ఆరుకోట్ల ప్రజలకు చేతులు కట్టుకొని సమాధానం చెప్పుకోవలసిన దినం ఒకటి వస్తుంది; ప్రజలను చేస్తున్న వంచనకు మూల్యం చెల్లించుకోవలసివస్తుంది.

గత ఆగస్టులో కేంద్ర ప్రభుత్వం అనాలోచితంగా వ్యవహరించి వుండకపోతే ఈపాటికి రామారావు పతనమైపోయి వుండేవారు; పార్లమెంటు ఎన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థులకు తగినన్ని నిధులు లభించివుంటే, కాంగ్రెస్ వాదులు వాళ్ళు మంచి పనిచేసివుంటే, విద్రోహచర్యలకు పూనుకొనకపోయివుంటే రామారావుకు పైత్యం ఇంతగా తలకెక్కివుండదు; ఈ తరుణంలోనైనా అభ్యర్థుల నిర్ణయంలో అగ్రనాయకత్వం వాస్తవికదృష్టిని ప్రదర్శించివుంటే రామారావు నృత్యానికి పగ్గాలు పడివుండేవి. కాని కాంగ్రెస్ వాదులపోటాపోట్లు, తప్పులు, దుర్బుద్ధులు రామారావుకు సింహాసనాన్ని యిచ్చాయి. స్వయంకృతాపరాధానికి కాంగ్రెస్ నాయకులు సిగ్గుతో తలవంచుకోవాలి.

అసెంబ్లీ రద్దయిన తర్వాత, మరీ ఎన్నికల తేదీలు ప్రకటించబడినతర్వాత ఓట్లకోసం ఆయన ఎన్నికార్యక్రమాలు రాత్రింబవళ్ళు అమలుజరిపిస్తున్నాడో, రాష్ట్రాభివృద్ధికి వినియోగపడవలసిన ద్రవ్యాన్ని ఎన్నికొల్లగొడుతూ దాచేస్తున్నాడో, అధికారాన్ని ఎంతగా దుర్వినియోగపరుస్తున్నాడో చూస్తూ తాము కోరినంత ధనం దోచిపెట్టలేదని కేంద్రాన్ని తిడుతుంటే వాస్తవాన్ని ప్రజల దృష్టికి తేకుండా వుండలేకపోతున్నాము.

పార్లమెంటు ఎన్నికలముందు పార్టీ ప్రచారానికి ప్రభుత్వధనంతో ప్రకటనలు చేయించుకున్నాడు; అదే కాంగ్రెస్ కేంద్రంలో అధికారంలోవున్నా, తన ప్రచారకాంక్ష, ప్రభుత్వధనాన్ని దుర్వినియోగంచేయకుండా, పార్టీపక్షంగా ప్రకటనలు యిచ్చుకున్నది. రామారావుది

—తరువాయి 8(ఎ) పేజీలో

## రాజశేఖర్‌కు రాజీవ్ చీవాట్లు?

ఎన్నికల ప్రచారానికి హైదరాబాదుకు వచ్చిన ప్రధాని రాజీవ్ గాంధీ పిసిసి అధ్యక్షుడు డాక్టర్ రాజశేఖరరెడ్డిని చీవాట్లు పెట్టినట్లు తెలిసింది. పెత్తనం పట్టించి రాష్ట్రంలో కాంగ్రెస్‌ను నాశనం చేశావు అని రాజీవ్‌గాంధీ రాజశేఖరరెడ్డితో అన్నారట.

కాంగ్రెస్ ముఖ్యులందరిని సమావేశపరచి జరిగిందేదో జరిగిపోయింది; కాంగ్రెస్ విజయానికి అరమరలులేకుండా పనిచేయండి అని ప్రధాని విజ్ఞప్తి చేశారట.

చేతులు కాలినతర్వాత ఆకులు పట్టుకుంటున్నారు ప్రధాని.



ఆంధ్రప్రదేశ్ నాయకుడు, తెలుగుదేశం స్థాపకుడు

శ్రీ ఎన్.టి. రామారావుగారి

స్వంత అభ్యర్థి



యువకుడు, ఉత్సాహవంతుడు

**శ్రీ తాళ్లపాక రమేష్ రెడ్డి గారికి**



'సైకిలు' గుర్తుపై

మీ పవిత్రమైన ఓటు ముద్రను వేసి

అత్యధిక మెజారిటీతో గెలిపించ ప్రార్థన.

—నెల్లూరు అసెంబ్లీ నియోజకవర్గ తెలుగుదేశం ఎన్నికల ప్రచార సంఘం.

# India's First 3D

పెద్దవాళ్లకు
పసందైన విందులు!
మీ కళ్లముందుకు
బ్రాందీ పెగ్గులు!
మీ నోటిముందు
మాంసాహార వంటకాలు!
తాగాలని, కమ్మగా తినాలని
ఆశ - భ్రమ!

భారతదేశంలో తొలి
3డి చిత్రం
నవోదయా వారి

## చిన్నారి చేతన 3డి

రాఘవ సినీ కాంప్లెక్సు

## కృష్ణ (ఏ. సి.) లో

## 14-2-85 తేది

ఉదయం ఆటతో ప్రారంభం

పరిసర ప్రాంతాల థియేటర్లలోనూ
చిన్న పట్టణాలలోనూ
ఈ చిత్రం ప్రదర్శించబడదు.

గమనిక : థియేటర్లవద్ద మాచే ఇవ్వబడు ప్రత్యేకమైన కళ్ళజోళ్ళు ధరించి ఈ చిత్రం చూడవలెను, టిక్కెటు లేని పిల్లలకు కళ్ళజోళ్ళు ఇవ్వబడవు.

మా థియేటర్లలో ప్రదర్శింపబడుతున్న చిత్రాలు

కావేరి (ఎ. సి.) లో 14—2—85 నుండి
ఉదయం ఆటతో ప్రారంభం రోజు 5 ఆటలు
**మహా సంగ్రామం**

కళ్యాణి (ఎ.సి.) లో 14—2—85 నుండి
రోజు 3 ఆటలు
**శ్రీమద్విరాట్**
**వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర**

లీలామహల్ (ఎ.సి.)లో 13—2—85 నుండి
**ANDROIED** (ఇంగ్లీషు)
14—2—85 నుండి మ. 12 గం. మహా సంగ్రామం

కిరణ్ (ఎ.సి.) లో 15—2—85 నుండి
ఉదయం ఆటతో ప్రారంభం
**రాజతిలక్** (హిందీ చిత్రము)

# జమీందార్ రైతు

## ఓట్ల కొరకు కాదు...

ఓటు తెలుగుదేశం పార్టీకి వేయండి అనే ప్రచారానికి వాడుతున్న సంపాద కీయం కాదిది. ముఖ్యమంత్రి శ్రీ ఎన్టీ రామారావు ఎలక్షన్ ప్రసంగాల నుండి కొన్ని మాటలు క్రింద ఇస్తున్నాము. వాటిని చదవండి; రాష్ట్ర శ్రేయస్సుకు, దేశ ఐక్యతకు, ప్రజల సంక్షేమానికి ఆ ప్రసంగాలు దోహద కరమో, విద్రోహకరమో ఆలోచించండి; లోతుగా, దీర్ఘంగా ఆలోచించండి. అభిప్రాయం ఏలా ఏర్పడితే, అలా చేయండి; అంతవరకే మా కోర్కె.

"హక్కుల సాధనకోసం కత్తులకు పదును పెట్టి పోరాటానికి ఉరకండి" (రంగారెడ్డి, మహబూబ్‌నగర్ జిల్లాల పర్య టనలో ఎలక్షన్ ఉపన్యాసాలలో ప్రజలకు రామారావు ఇచ్చిన పిలుపు- ఉదయం, ఫిబ్రవరి 11)

"ఎవడబ్బ సొమ్మని మనకిస్తున్నారు? నిధుల కేటా యింపు విషయంలో ఆంధ్రులకు అన్యాయం ఏదైనా జరిగితే తిరుగుబాటు తప్పదు" (10 తేది రాజమండ్రి సభలో రామారావు-'ఈనాడు' ఫిబ్రవరి 12)

కుత్రంత్రంగా వ్యవహరిస్తున్నారని ప్రధాని రాజీవ్‌ను ముక్కచగా మాట్లాడారు. అది మామూలే; అంతేకాదు "ప్రజలు ఓట్లతో అధికారంలోకి వచ్చిన తెలుగుదేశంపార్టీని విమర్శించే హక్కుగాని, అర్హతగాని కాంగ్రెస్‌కు లేదు" (రాజమండ్రి సభలోనే రామారావు)

రంగారెడ్డి, మహబూబ్‌నగర్ జిల్లాల పర్యటనలో ముఖ్యమంత్రిగారి మాటలు మరికొన్ని—"రక్తాన్ని చెమటగా చిందించే కార్మికులు, కర్షకులు ఆర్థిక స్వాతంత్ర్యం, సమానత్వం కోసం పోరాటంలో ముందుకు రావాలి. కొందరు సంపన్నులు స్వార్థంతో సంపదనంతా గుప్పిట పెట్టుకోజూడడం సమాజానికి ద్రోహం... తెలుగుదేశం పార్టీ కర్షకుల కన్నీటి నుండి, కష్టజీవుల స్వేదం నుండి, కార్మికుల కంటి ఎరుపు నుండి ఆవిర్భవించింది; అంతేకాని ధనవంతుల ఇనప్పెట్టె లోంచికాదు" (ఉదయం- ఫిబ్రవరి 11)

చివరన కమ్యూనిస్టు మూలసిద్ధాంతాన్నిసైతం రామారావు ఏకరువు పెట్టారు. "సమాజంలో ధనికులు, పేదలు అనే రెండే వర్గాలున్నాయి. దగాకోరువిధానంతో డబ్బు మూటకట్టడం శుభసూచకం కాదు" —ఇవీ ఆయన సుభాషితాలు. ఇప్పుడు రోజూ ఆయన ప్రసంగా లను చదవగలిగితే ఇటువంటి ఆణిముత్యాలు అనేకం దొరుకుతాయి.

పేద బడుగు ప్రజలు హాజరయ్యే సభలలో రామారావు వేషం మార్చినట్లు మాటలుకూడా మార్చి ఓట్లకక్కుర్తికి విప్లవవాదిగా, పేదప్రజల ప్రతినిధిగా చెప్పుకున్న ఆవేశంతో ఆకర్షణకోసం ఆషామాషీగా సినిమా డైలాగులాగా ఈ హింసాప్రేరిత ప్రసంగాలు చేస్తున్నాడనుకోవాలా? లేక ఉద్దేశ్యపూర్వకంగానే కేంద్రంమీద తెలుగుప్రజల తిరుగుబాటుకు పిలుపు ఇస్తున్నాడనుకోవాలా? "వర్గశత్రువుల" ను తుదముట్టించడానికి తుపాకి చేబూనమనే నక్సలైట్లకు, కత్తులు పదును పెట్టమనే ముఖ్యమంత్రి రామారావుకు తేడావున్నదంటారా? రహస్యంగా, పరిమితరంగంలో హింసను ప్రేరేపించే నక్సలైట్లు దేశద్రోహులుగా చెలామణైతే, బాధ్యతగల ముఖ్యమంత్రిగా వుండి బహిరంగంగా బహుళవ్యాప్తంగా హింసను ప్రబోధిస్తున్న రామారావుగారు ఎవరిక్రిందకు వస్తారు?

కేరళలో ఇప్పటికి మూడుసార్లు కమ్యూనిస్టు ప్రభుత్వాలు ఏర్పడ్డాయి; పశ్చిమ బెంగాల్, త్రిపురలో పరిపాలిస్తున్నది మార్క్సిస్టు ప్రభుత్వాలే; కర్నాటకలో జనతాపార్టీ అధికారం నెరపింది. 1967 లో అనేక రాష్ట్రాలలో కాంగ్రెసేతర ఐక్యసంఘటన ప్రభుత్వాలేర్పడ్డాయి. వీరిలో ఏ ముఖ్యమంత్రి అయినా, అందులోనూ ఏమార్క్సిస్టు ముఖ్యమంత్రి అయినా ఏనాడైనా, ఏసందర్భంలో నైనా రామారావువలె కేంద్రంమీద కత్తులు దూయమన్నారా? తిరుగుబాటు చేయమన్నారా? ఇప్పుడైనా అటువంటి హింసాత్మక ప్రబోధాన్ని చేస్తున్నారా? ఎవడబ్బసొత్తు, ఎవరితాతముల్లె అని ప్రధానమంత్రిని మనదేశంలోనేకాదు, ప్రపంచంలోని ఏదేశంలోనైనా, ఎంత ప్రభుత్వ వ్యతిరేకి యైనా ఇంత పరుషంగా ముక్కచగా మాట్లాడుతున్నారా?

ఒకసారి ఆలోచించండి: ముఖ్యమంత్రి రామారావు ధోరణి ఎంత ప్రమాదకరంగా పరిణమిస్తున్నదో యోచించండి॥

# కాంగ్రెస్ కుతంత్రం - తెలుగుదేశం నియంతృత్వం!

కాంగ్రెస్ అభ్యర్థుల జాబితా ఎంత కలవరం కల్గించిందో, తెలుగుదేశం అభ్యర్థుల జాబితాకూడా అంత దిగ్భ్రమ కల్గించింది. తొలుత తెలుగుదేశం జాబితా చూచి కాంగ్రెస్ వారు సంబరపడితే, తర్వాత కాంగ్రెస్ జాబితా చూచి తెలుగు దేశంవారు సంతోషపడ్డారు. మొత్తమ్మీద ఇరువర్గాలకు హాని, చింత తప్పలేదు.

ఈ రెండు జాబితాలను జాగ్రత్తగా పరిశీలిస్తే పార్టీ నాయకుల ఆలోచనా ధోరణిని కొంతవరకు తెలుసుకోవచ్చు. తెలుగుదేశం పార్టీలో చిల్లరదేవుళ్ళ ప్రభావాన్ని అంతం చేయడానికి ఎన్టీఆర్ ప్రయత్నించినట్టు కనబడుతూంది. అందరూ నిమిత్తమాత్రులు. నడిపేది నడిపించేదీ అంతా తానే. ఆనే ధోరణితో ఆయన అభ్యర్థులను నిర్ణయించాడు. పార్టీ మూలవిరాట్టు ఆయన కాదు. తన బంధు జనం, భక్తజనం తప్ప, మరెవరిమాటా చెల్లుబడి కాకుండా చేశారు. జిల్లా నాయ




కులు, వారి అనుచరవర్గంగా కొందరు కావలసినవుండే అవకాశానికి స్వస్తి చెప్పి, అంతా కేంద్రీకరించేశాడు. ఇప్పుడు దరూ ఎన్. టి. ఆర్. భక్తగణమే; అందరూ ఆయన వరప్రసాదితులే. ఒక విధమైన నియంతృత్వం ఇది.

కాంగ్రెస్‌లో వాస్తవిక పరిస్థితుల్ని దృష్టిలో ఉంచుకోకుండా, ఢిల్లీ దర్బారులోని వందిమాగధులు జాబితాను తమ ఇష్టం వచ్చినట్టు తయారుచేసినట్లు కన బడుతూంది. అధికారబలాన్ని ఎదుర్కొ నడానికి ప్రజాబలం వున్నవార్ని అభ్యర్థులుగా నిర్ణయించాల్సిందిపోయి, నాకు నిజాయితీ లేనివార్ని ఎంపిక చేయడమంటే పార్టీ పునాదుల్నే పడగొట్టడమన్నమాట. నాయకులు ఒకరిపై ఒకరు కసితో పార్టీని నాశనం చేయబూనుకున్నారు. అందుకు అధిష్ఠానవర్గంకూడా చేయూత నిచ్చింది.

తెలుగుదేశం పార్టీలో నాయకత్వం నియంతృత్వంగా నడుస్తుంటే, కాంగ్రెస్‌లో అధిష్ఠానవర్గం బలహీనమైంది అయి వుండి, వందిమాగధుల కుతంత్రాలను నివారించలేక పార్టీని నాశనంచేస్తూంది.

నెల్లూరు -వి. కృష్ణమూర్తి

—కొత్తకోట వ పేటలో

# ఎన్ టి ఆర్ ఏ స్థానం వదులుకొంటారు?

మూడు ప్రాంతాలలో మూడు నియోజకవర్గాలనుంచి నామినేషన్లు వేసిన ఎన్ టి ఆర్ త్రిపాత్రాభినయం (ఫిబ్రవరి 8 తేది 'జనవాణి' శీర్షిక) గూర్చి పి. సుబ్బారావు వెలిబుచ్చిన అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను.

ఎన్ టి ఆర్ గుడివాడలో గెలవలే ననే ఉద్దేశంతో నల్గొండ, హిందుపురం నియోజకవర్గాలనుంచికూడా పోటీ చేస్తున్నాడు. మూడు ప్రాంతాలూ తనకు సమానమేనని చెప్తున్న రామారావు రేపు మూడు నియోజకవర్గాలలో గెలిస్తే, మూడు శాసనసభ్యత్వాలలో కొనసాగడానికి రాజ్యాంగం అనుమతించదు. ఆ విషయం తెలిసీ ఆయన మూడు స్థానాలకు పోటీ చేయడం హాస్యాస్పదం. మూడూ గెలిస్తే, ఏ సభ్యత్వం ఉంచుకొని, ఏది రాజీనామా చేస్తాడో ముందుగా ప్రకటించే ధైర్యం రామారావుకు ఉందా? రాజీనామాచేసే ప్రాంతాలమీద ఆయనకు అభిమానం లేనట్టు అర్థంచేసుకోవాలా?

ఇదొక సినిమా స్టంటు తప్ప మరేమీ కాదు. ప్రజలు నమ్మినంతకాలం ఈ స్టంట్లు చెల్లుబాటవుతాయి, కొందర్ని ఎల్లకాలం మోసగించవచ్చు, అందర్ని కొంతకాలం మోసగించవచ్చు కాని అందర్నీ ఎల్లకాలం మోసగించలేరన్న సత్యాన్ని రామారావు గుర్తించే రోజు దూరంలో లేదు.

ఆత్మకూరు -పి. బలరామరెడ్డి

## మేము-మీరు

### మా ఊరిపేరు

'ఊరూపేరు' శీర్షికలో గ్రామనామాలగూర్చి శ్రీ వావిలకొలను సుబ్బారావు కృష్ణరావు అవాస్తవమైన విషయాలు రాస్తున్నారు. కోవూరుతాలూకా రేబాలలో కావురం

—కొత్త కోట వ పేటలో

సరిక్రొత్త
డిజైనులలో
అర్గండి, కోట, లేపాక్షి,
చందేరి, బెటిగా కారీవ్
వచ్చియున్నవి.
మఫత్‌లాల్ షో రూమ్
ట్రంకురోడ్డు - నెల్లూరు

మీసర్టిఫికేట్లు, డాక్యుమెంట్లు
బ్లూప్రింట్‌లు, వగైరాలను
మీరు ఇచ్చినవెంటనే మా
ఆటో జెరాక్స్‌నందు
నిమిషానికి 30 కాపీలు
తీసి ఇవ్వబడును
ఆటో జెరాక్స్
రాధాథియేటరు ఎదురు - నెల్లూరు
గ్రామ్స్: జెరాక్స్ ఫోన్: 3849

ఆహ్లాదకరమైన
వాతావరణంలో-నోరూరించే
రుచులతో అత్యున్నత
ప్రమాణాలతో ఆంధ్ర వంటకాలు.
ఒక్కసారి విచ్చేయండి
మరల, మరల రావాలనిపించే చోటు!
హోటల్ నిర్మల A/C
ప్రీమియర్ షాపింగ్ సెంటర్ (L.I.C ఎదురుగా)
మౌంటురోడ్డు - మద్రాసు-2
Ketha Arts
JOLLY

# కాంగ్రెస్‌కు అంత్యక్రియలు జరిపి వైదొలగుతాడా పిసిసి రాజశేఖరరెడ్డి?

"రాష్ట్రంలో కాంగ్రెసుకు అంత్య క్రియలు జరపవిదే పిసిసి అధ్యక్షుడైన డాక్టర్ వై. ఎస్. రాజశేఖరరెడ్డి తన పదవినుండి వైదొలగడా? కాంగ్రెస్ అధిష్టానవర్గం రాష్ట్రంలో పార్టీకి ఆగతి ఏర్పడటకు బాధ్యతవహించదా?"

ఈమాటలు అంటున్నది నేడు రాష్ట్రంలోని కాంగ్రెస్ వాదులు, కాంగ్రెస్ అభిమానులేకాదు; సామాన్య ప్రజలు మనోభావాలకు వైకల్పం వైపరీత్యం రూపమునదం ఎత్తుచూపుతుంది కాదు మరీ కాంగ్రెస్ శ్రేయస్సును. కోల్పోయినస్థానాన్ని పునరుద్ధరించుకోవాలనే ఆకాంక్ష ఆవేదన బలంగా కలిగిన కాంగ్రెస్‌వాదులు ఈ పరిస్థితిచూసి కడుపు తరుక్కుపోతున్నారు. అభ్యర్థుల నిర్ణయంలో జరిగిన అవకతవకలను, ఆ వాస్తవికతలోంచి, అన్యాయంగా చేస్తున్న వారిలో వారు ఈ సమయంలో కాంగ్రెస్ ద్రోహులు, శక్తులవి పార్టీ అభిమానుల అభిప్రాయం.

మునలితనం, పాతతరం పాతుకునే వుండాలని ఎవ్వరూ అభిప్రాయపడడం లేదు. యువతకు, నవతకు, కొత్తకు స్వాగతంచెప్పాలని. పీఠాలనివ్వాలని. పాతస్థానాన్ని కొత్త అలంకరించాలనేదే కాంగ్రెస్‌వాదుల అభీష్టం అంతేకాదు; వెనుకబడిన తరగతులవారికి, అందులో కూడా సంపన్నులకుకాకుండా విద్యావంతులైన మధ్యతరగతివారికి స్థానం ఇవ్వాలన్నదికూడా వారికోర్కె. కాని యువత నవత నిక్తేకాదు, యోగ్యత, సేవానిరతిని ప్రాధాన్యం వహించాలనేది కాంగ్రెస్‌వాదుల అభిప్రాయం. అంతేకాదు, ఈకొత్తవారందరూ ఎన్నికలకు ముందే సేవారంగంలో వుండటం, ప్రజలకు పరిచితులుగా వుండటం అవసరం. అంతేకాదు వీరి కార్యరంగం ఏ నియోజకవర్గమైవుంటుందో, ఆ నియోజకవర్గంలోనే వారిని అభ్యర్థులుగా నిర్ణయించడంకూడా అవసరం.

ఇప్పటి కాంగ్రెస్ అభ్యర్థుల ఎంపికలో వీటినేమైనా పాటించారా? కనీసం పాటించటానికి ప్రయత్నించారా? అర్హత, యోగ్యత సేవ నిరతి, ప్రత్యర్థిని ఐట్టి అతనికి దీటైన, తాము నిర్ణయించుకున్న సూత్రాలకు అనుగుణంగానే అభ్యర్థిని నిర్ణయించారా? ఇవేవీ పరిగణనకు తీసుకోలేదు. అయోగ్యులు, శీలహీనులు, జనహీనులు, నియోజకవర్గంలో పూరా పేరు తెలియని అనామకులైన వరాయివారు అభ్యర్థులుగా నిర్ణయింపబడినారు.

—కొరవ 7 వ పేజీలో



పార్టీ గట్టెక్కింపా? ఫిరాయింపా?

జిల్లాలో ఈవారం ఎలక్షన్ చిత్రం

# తిరుగుబాట్లు, తికమకలు!

జిల్లాలో ఈవారం, అంటే నికరంగా అభ్యర్థుల పోటీ తేలినతర్వాత, కనబడుతున్న ఎన్నికలచిత్రం ఒక్కమాటలో చెప్పాలంటే తిరుగుబాట్లు, తికమకలు. కాంగ్రెస్‌పరిస్థితే గందరగోళమనుకుంటే, తెలుగుదేశంస్థితి మరీ అధ్వాన్నం, గెలుపు ఓటముల విషయంకాదుగాని, ఒకవిధంగా తెలుగుదేశంకంటే కాంగ్రెసే మేలనిపిస్తున్నది. కాంగ్రెస్‌లో బహిరంగ తిరుగుబాట్లులేవు; కాని తెలుగుదేశంలో అవి సాక్షాత్కరిస్తున్నాయి. ఒకే ఒక మాటగా చెప్పాలంటే తెలుగుదేశీయుల మీద అన్నగారిపట్టు చెడి, జారుగొంతు పతలాయి.

జిల్లాలోని తెలుగుదేశంలో రెండు గ్రూపులు; ఎం. ఎల్. సి. గంగాధరం గారిని ఒకప్రత్యేకవర్గంగా పరిగణించాలనో, లేక ఆయనకు ఈతెంటిలో దేనితోనైనా అనుబంధముందో తెలియదు, వేరుగా ఎన్టీ ఆర్ కే చెందిన వర్గం కూడా ఒకటుందేమో చూడాలి, అంటే జిల్లాలో దేశానికి ఏకనాయకత్వమేకాదు, ఐక్య నాయకత్వంకూడా లేదు;

—కొరవ 8వ పేజీలో






దేశ భద్రత

దేశ సమగ్రత

దేశ సమైక్యత

ఇందిరా కాంగ్రెస్ ధ్యేయం

అందుకు కట్టుబడి రెండు దశాబ్దాలుగా రాపూరు ప్రజలకు సేవచేస్తున్న మన ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థి

# నువ్వుల వెంకటరత్నంనాయుడు గారికి

అత్యధిక మెజారిటీ చేకూర్చండి!

హస్తం గుర్తుకు

మీరు వేసే ప్రతి ఓటు

దేశ శ్రేయస్సుకు దేశ పురోభివృద్ధికి రాచబాట!





—రాపూరు కాంగ్రెసు (ఐ) ఎన్నికల ప్రచార సంఘం.

# ఈసారి ఓటర్లూ పెరిగారు- అభ్యర్థులూ పెరిగారు!

జిల్లాలోని పదకొండు శాసనసభా నియోజకవర్గాలలో మొత్తం 69 మంది అభ్యర్థులు పోటీచేస్తున్నారు. కాంగ్రెస్ పదకొండు స్థానాలకు పోటీచేయగా, తెలుగుదేశం 9, సి. పి. ఎం. ఒకటి, లోక్‌దళ్ ఒకటి, బి. జె. పి 1, ప్రజాస్వామ్య తెలుగుదేశం 6 స్థానాల్లో అభ్యర్థులను నిలబెట్టాయి. పోతే తక్కిన 40 మంది ఇండిపెండెంట్లు.

జిల్లాలో మొత్తం ఓటర్ల సంఖ్య 13,15,317, వారిలో స్త్రీలు 662775 మందికాగా పురుషులు 652542 మంది. 1983 ఎన్నికలతో పోల్చుకుంటే ఇప్పుడు ఓటర్లూ పెరిగారు, అభ్యర్థులూ పెరిగారు. అప్పుడు ఓటర్లు 12,70,742; అభ్యర్థులు 51 మంది. 1978లో ఓటర్లు 11,37,016; అభ్యర్థులు 58 మంది. నియోజకవర్గాల వారీగా అభ్యర్థులు, ఓటర్ల వివరాలు ఇవి.

**ఉదయగిరి :**

ఓటర్లు: 1,10,210

ధనుంజుల వెంకటనరసింహం (తెదే), ఎం. రాజమోహనరెడ్డి (కాం) కె. విజయరామిరెడ్డి, గూడూరు వెంకయ్య - ఇండి.

**కావలి :**

ఓటర్లు, 1,16,145

మువ్వల వెంకటనారాయణ (తెదే), కలికి యానాదిరెడ్డి (కాం), పాలకీర్తి కోటయ్య (ప్ర. తె), నెల్లూరి కనావెంకట్రావు, దవ్వూరు వెంకటరామయ్య, మహమ్మద్ హనీఫా - ఇండి.

**అల్లూరు :**

ఓటర్లు: 1,10,884

మోర్ల ఆనందరావు (కాం), జక్కా వెంకయ్య (సిపిఎం), ఈదూరు సుధాకర్ (ప్ర. తె), బెజవాడ దశరథరామిరెడ్డి, కాటం మల్లారామిరెడ్డి, పేనా ఆదిశేషారెడ్డి, పత్తిపల్లి పెదవెంకయ్య - ఇండి

> పదకొండు స్థానాలకు
> 69 మంది అభ్యర్థులు

**కోవూరు :**

ఓటర్లు: 1,14,788

ఎస్. శ్రీనివాసులురెడ్డి (తె.దే), సి. దేవకుమార్‌రెడ్డి (కాం), బి. లావయ్య (ప్ర. తె.), ఎస్. దశరధరామిరెడ్డి, బిల్లా దాసు, ఎం. ఆరోగ్యస్వామి, వై. జగన్మోహన - ఇండి.

**ఆత్మకూరు :**

ఓటర్లు: 1,29,497

డా॥ బి. సుందరరామిరెడ్డి (కాం), ఎం. వెంకయ్యనాయుడు (బిజెపి) అక్కాకుల ప్రసాదరావు, టి. సారథి - ఇండి

**రాపూరు :**

ఓటర్లు: 1,16,524

ఆనం రామనారాయణరెడ్డి (తెదే), పువ్వల వెంకటరత్నంనాయుడు (కాం) రావుల అంకయ్యగౌడ్, ఎస్. రాఘవరెడ్డి, ఎం. వెంకటకృష్ణారెడ్డి జి. శ్రీనివాసులు, కె. రామచంద్రారెడ్డి, కె. వెంకటస్వామి, జి. సుబ్బరామరాజు, - ఇండి

**నెల్లూరు :**

ఓటర్లు: 1,35,921

తాళ్లపాక రమేష్‌రెడ్డి (తెదే), కె. వి. సుబ్బారెడ్డి (కాం), అప్పం రాజరత్నం, ఎం. ఆరోగ్యస్వామి - ఇండి

**సర్వేపల్లి :**

ఓటర్లు, 1,22,712

ఈదూరు రామకృష్ణారెడ్డి (తెదే) కె. విజయకుమార్ రెడ్డి (కాం) టి. వెంకటశేషారెడ్డి (ప్ర. తె), నెల్లూరు బుజ్జయ్య (లోక్‌దళ్), కె. పుర్దానరెడ్డి, టి. ఆనందం, పి. గోపాలరెడ్డి, మైనంపాటి వెంకయ్య - ఇండి

**గూడూరు :**

ఓటర్లు; 1,29,164

బల్లి దుర్గాప్రసాదరావు (తెదే), డా॥ ఎం. కమలయ్య (కాం), కె. రామచంద్రయ్య (ప్ర. తె) పి. ఆనందరావు, ఎం. శ్యామసుందరరాజు, బి. శివయ్య, - ఇండి

**సూళ్ళూరుపేట :**

ఓటర్లు;

ఎం. మణెయ్య (తెదే), పిట్ల వెంకట సుబ్బయ్య (కాం), అనపల్లి భూషయ్య, డి. వీరాస్వామి, - ఇండి.

**వెంకటగిరి :**

ఓటర్లు: 1,15,675

వి. భాస్కరసాయి యాచేంద్ర (తెదే) పి. బాలకృష్ణారెడ్డి (కాం) కె. రామచంద్ర నాయుడు (ప్ర. తె.), వి. రాధాకృష్ణయ్య, సి. శ్రీనివాసులు, కె. దశరథరామరాజు, సి. శేషమ్మ, పి. వెంకటరత్నం, ఎం. సుబ్రహ్మణ్యం, - ఇండి.

వెంకటగిరిలో పదిమంది, రాపూరులో తొమ్మిదిమంది, సర్వేపల్లి ఎనిమిదిమంది, అల్లూరు, కోవూరుల్లో ఏడుగురు. కావలి, గూడూరుల్లో ఆరుగురు; ఉదయగిరి, ఆత్మకూరు, నెల్లూరు, సూళ్లూరుపేటల్లో నల్గురువంతున పోటీల్లో వున్నారు.

## జిల్లావార్తలు

### పొట్టేపాళెం శ్రమదానం

పాలిటెక్నిక్‌కు చెందిన 116 మంది ఎన్. సి. సి. క్యాడెట్లు 10వ తేదీ నెల్లూరు తాలూకా పొట్టేపాళెంలో శ్రమదానం చేసి కిలోమీటరు రోడ్డు వేశారు. ఆసందర్భంగా జరిగిన సభకు ప్రిన్సిపాల్ కె. నాగేశ్వరరావు అధ్యక్షించారు; ఎస్. సి. ఆర్. ఆర్. ఆర్. గిరీష్‌కుమార్, సిండికేట్ బ్యాంకు రీజనల్ మేనేజరు శ్రీ ఎస్. జి. ఎన్. రాజా ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. సిండికేట్ బ్యాంకు డివిజనల్ మేనేజరు శ్రీ కామేశ్వరరావు, ఎన్. సి. సి. కమాండింగ్ ఆఫీసరు శ్రీ ఎల్. కె. టి. శర్మ, కంపెనీ కమాండర్ లెఫ్టినెంట్ శ్రీ టి. ఎం. మంచయ్య, విద్యార్థులు శ్రీ ఆర్. కిరణ్ కుమార్, శ్రీ కె. రోశయ్య మాట్లాడారు.

### గూడూరు నేత్రశిబిరం

గూడూరు లయన్స్ క్లబ్ ఈనెల మొదటివారంలో ఉచిత నేత్రశిబిరం నిర్వహించింది. ముగింపుసభలో ప్రసంగిస్తూ నెల్లూరు పెద్దాసుపత్రి సూపరింటెండెంట్ డాక్టర్ ఎం. వి. రమణారావు జిల్లాలో ఇప్పటికి 10 ఉచిత నేత్రశిబిరాలు జరిగాయని చెప్తూ, పసిపిల్లలకు నేత్రచికిత్సా శిబిరాలు నిర్వహించాల్సిందిగా లయన్స్ క్లబ్‌ను కోరారు.

సభను గూడూరు లయన్స్‌క్లబ్ అధ్యక్షుడు శ్రీ జి. సురేంద్రనాథ్ అధ్యక్షించారు. లయన్స్ గవర్నర్ డాక్టర్ కె. సుబ్బయ్య, నెల్లూరు బి. సి. హాస్పిటల్ సూపరింటెండెంట్ డాక్టర్ మిస్ బేక్, శిబిరం ఛైర్మన్ డాక్టర్ సి. ఆర్. రెడ్డి, ప్రొద్దుటూరు లయన్స్‌క్లబ్ కార్యదర్శి శ్రీ ఎం. కృష్ణారెడ్డి, లయన్స్ మాజీగవర్నర్ శ్రీ సి. వి. కృష్ణయ్య తదితరులు ప్రసంగించారు.

కంటి ఆపరేషన్లు చేయించుకున్న వారికి శ్రీ శేక్ జెబ్ మలానీబైరా కళ్ళద్దాలు పంచిపెట్టారు; డాక్టర్లకు శ్రీమతి వనజాక్షమ్మ మెమెంటోలు ఇచ్చారు. లయన్స్ కార్యదర్శి శ్రీ జి. లక్ష్మయ్య వందనాలు చెల్లించారు.

### కొండూరు వైద్యశిబిరం

వార్తలు, చేపలు నిలవవుంటే చెడిపోతాయని ఇంగ్లీషులో ఒక సామెత వుంది. ఐతే ఎన్నాళ్లయినా చెడిపోని వార్తలు కొన్నివుంటాయి. అటువంటిదే ఈ కోడూరు వైద్యశిబిరం వార్త.

ఇందుకూరుపేట తా॥ కోడూరులో నెల్లూరు రోటరీ లయన్స్, ఇండియన్ మెడికల్ అసోసియేషన్, మెడికల్ రెప్రజెంటేటివ్స్ అసోసియేషన్ సంయుక్త ఆధ్వర్యంలో ఉచిత వైద్యశిబిరం జరిగి నెల దాటింది. ఆ వార్తాపత్రిక ఎట్లాగో మా కాగితాల కొండల్లో పడిపోయి పత్రిక కెక్కకుండాపోయింది. ఐతే మంచిపనిని గూర్చి రాయడానికి ఎప్పుడైతేనేమి? కాస్త ఆలస్యమైనా అభినందించదగిన సేవకదా ఇది.

కోడూరు ప్రభుత్వాస్పత్రి డాక్టర్లు శ్రీ టి. వి. సుబ్బర్షి, శ్రీమతి అరుణామూర్తి ఈ ఉచిత వైద్యసేవా శిబిరాన్ని పెద్ద ఎత్తున నిర్వహించారు. వివిధ రంగాల్లో ప్రావీణ్యం గల్గిన పదిహేనుమంది డాక్టర్లు ఈ శిబిరంలో పాల్గొని, దాదాపు మూడువేలమందికి ఉచితంగా చికిత్స చేశారు; ఉచితంగా మందులు కూడా యిచ్చారు.

కోడూరు సర్పంచ్ శ్రీ రవీంద్రరెడ్డి ఈ శిబిరాన్ని ప్రారంభించారు; శ్రీ కోడూరు శేషురెడ్డి డాక్టర్లకు మెమెంటోలు ఇచ్చారు.

శిబిరం నిర్వహించిన డాక్టర్ మూర్తి నెల్లూరు హరిజన నాయకుడు శ్రీ కేరే రాయప్ప కుమారుడు. కోడూరు పరిసర గ్రామాలకు చెందిన పేదసాదలు ఈ శిబిరంలో పాల్గొన్నారు.

### ఆత్మకూరు మహిళా సంక్షేమం

ఆత్మకూరు ఇందిరాగాంధీ మహిళా మండలి ఆధ్వర్యంలో 28 తేదీ మహిళా సంక్షేమ శిబిరం నిర్వహించారు. దాదాపు వందమంది స్త్రీలు పాల్గొన్న ఆ శిబిరంలో జనాభాసమస్య, ఆరోగ్యం, కుటుంబ సంక్షేమం వగైరా విషయాలను గూర్చి ప్రసంగించారు.

సభను శ్రీమతి బొమ్మాదుల సుబ్బమ్మ అధ్యక్షించింది; ఎ. ఎస్. పేట ప్రాథమికారోగ్యకేంద్రం డాక్టరు శ్రీ దశరథ రామరెడ్డి, వైద్యారోగ్యశాఖ జిల్లా ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు శ్రీ సేతు మాధవరావు, డెప్యూటీ ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు శ్రీ ఆర్. ఎన్. ప్రసాదరావు, అసిస్టెంట్ మలేరియా ఆఫీసరు శ్రీ అయోధ్యరామయ్య, శ్రీమతి కనకలత, శ్రీ సుబ్రహ్మణ్యం తదితరులు ఉపన్యసించారు. శ్రీ మాసూమ్ వందనాలు చెల్లించారు.

---


రైతు సోదరులకు విజ్ఞప్తి

వేరుశనగ, వరి ఇతర పైరులకు -
చవిటిపొలాల చవుడు విరిచేందుకు ఎత్తినది

**జిప్సమ్**

( జింక్ ఫాస్ఫేట్ మరియు సల్ఫర్ )

వాడి అధిక దిగుబడి పొందండి.

కావలసినవారు;

M/s. యడ్లపల్లి గోవిందుశెట్టి
స్టోన్‌హౌస్‌పేట - నెల్లూరు



కాఫీ కప్పుతోనే తాగాలి! విస్కీ గ్లాసుతోనే తాగాలి!

అలాగే
భోజనమంటూచేస్తే
నవయుగలోనే చేయాలి!

✳

**హోటల్ నవయుగ**

ఎయిర్ కండిషన్డ్

మైలాపూర్ - మద్రాస్ 600 004 ఫోన్ : 76164

క్యారియర్ మీల్ } రు. 12-00
ఫ్రీ: 2 పీస్ కర్రి లేక 2 ఎగ్ మసాలా

| | | |
|---|---|---|
| నవయుగ చికెన్ | ... ... | 10-00 |
| నవయుగ ఫిష్ | ... ... | 6-00 |
| చికెన్ ఫ్రై | ... ... | 6-00 |
| మటన్ ఫ్రై | ... ... | 6-00 |
| ఫిష్ ఫ్రై | ... ... | 3-00 |
| ఫిష్ కర్రి | ... ... | 3-00 |

20 సం॥గా మీ ఆదరాభిమానాలతో ముందంజవేశాం.
ఇకముందు కూడా మీ శుభాకాంక్షలను ఆశిస్తున్నాం.

# హాస్టల్ జ్యోత్స్న

**175, లాయడ్స్ రోడ్, మద్రాసు 86**

( మద్రాసులో నెల్లూరువారి హాస్టలు )

తెలుగు మీడియం నుంచి, ఇంగ్లీషు మీడియంకు మారదలచిన వారికి, ఇంగ్లీషు మీడియంలోనే వుంటూ, 'డల్'గావున్న విద్యార్థులకు, వయసు ఎక్కువగా వుండి డబుల్ ప్రమోషన్ కోరే పిల్లలకు మార్చి 5 నుంచి జూన్ 5 వరకూ ప్రత్యేక కోచింగ్ క్లాసులు ప్రారంభిస్తున్నాము. IInd bach గుర్తింపు పొందని స్కూళ్ళలో చదువుతున్న విద్యార్థులకైనా సరే. 8వ తరగతి వరకు గుర్తింపు కలిగిన స్కూళ్ళలో ప్రవేశానికి ఏర్పాటు చేయగలం.

పూర్తి వివరాలకు మార్చి 1 లోగా పై అడ్రసులో సంప్రదించండి.

పి.వి. సుబ్బారెడ్డి
కరెస్పాండెంటు.

ఫోను: పిపి 473421



# స్కాలర్స్ ట్యుటోరియల్స్

(సి ఎ యం కాంపౌండ్.)

నెల్లూరు-3.

10th క్లాసు పబ్లిక్‌గా హాజరగు విద్యార్థులకు, అక్టోబర్‌లో పరీక్ష తప్పిన విద్యార్థులకు తరగతులు ప్రారంభమైనవి.

అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులచే శిక్షణ,

కె. జయలక్ష్మి, M.A.B.Ed.
ప్రిన్సిపాల్



# కావలిలో ఇల్లు అమ్మబడును

కావలి, మున్సిఫ్‌కోర్టు ఎదురుగా ట్రంక్‌రోడ్డులోని, 23 అంకణాల ఖాళీస్థలం, అందులోని 33 అంకణాల కట్టుబడిగల 3 అంతస్తుల భవనం బార్ & రెస్టారెంట్‌లకు అనువైనది అమ్మబడును.

—వివరాలకు—

స్టార్ స్టుడియో, ట్రంక్‌రోడ్ - నెల్లూరు

PHONE : 5753

పి. సూర్యనారాయణ, బాలాజీ ఆక్షన్‌హాల్ - కావలి

PHONE : PP 246



రేబాల గ్రామపంచాయితి

## టెండరు నోటీసు

బుచ్చిరెడ్డిపాళెం సమితి రేబాల గ్రామపంచాయితికి ఈ క్రింద కను పరచిన వస్తువులు సప్లయి చేయుటకు 18.2.85 తేది సాయంకాలము 3 గంటలకు సీల్డు టెండర్లు తీసుకొనబడును. అదేరోజున సాయంకాలము 3-30 గంటలకు టెండర్లు తెరువబడును.

వివరములు: క్రాంప్టన్ లేక మైసూరు కంపెనీల 4 అడుగుల ట్యూబ్‌లైటు ఫిక్చరు, క్లాంపులు, పైపులు వైరుతోసహా మొత్తము సెట్లు ఒకటికి కొటేషన్లు కోరబడుచున్నవి.

ధరావత్తు రూ. 50-00 లు

షరతులు: క్రాంప్టన్ లేక మైసూరు కంపెనీల అథరైజ్డు డీలర్లు నుండి మాత్రమే టెండర్లు తీసుకొనబడును. మిగత విషయములు ఆఫీసు పనిచేయు వేళలయందు తెలుసుకొనవచ్చును.

పి. శ్రీనివాసులరెడ్డి
సర్పంచ్


# శివారెడ్డి పద్యాలు

### ఎన్నికలు

ఎన్నికలంటేనేగుర్తొచ్చె ఏమి ప్రామాణ్యం
కలము మనసులకాల కదలకం
ముందుకుతరకడంల నుంచడంఅసెయడంల
కేరలోన్త తన్వాతకాన్త!

అర్థమొర్చినట్లు ఏదేవా గోకేది
అదివాల్తా చేతిగద్దమేల
ఇప్పుడీదినల్లో తప్పైన హాపైన
బయటపెట్టకాదు ఓటుమదేదు!

ఎంతకాలమైందో ఏనాడుబట్టిందో
కాంగిరేసు ఏమికాకపుమ్మ
వీకైంది పదికీకాకుండబోయింది
తెలుగుప్రజకు నాస్తి తెలిసివొస్తి!

ఒకరిపైన వొకరు వాంగేసుకుంటె
పాడుబడిరె జాట్లు పంచెమునకు
వచ్చె కాంగ్రెసోడు వచ్చిండిరాముప్పు
అంటుకుంది విప్పు అర్పెదెవరు?

రామరావు పైకిరాగల్గినాడంటె
ఎన్టియారు గద్దెయెక్కెనంటె
తెలుగువిుతకెల్ల తలవంపు యిటివచ్చె
రాష్ట్రకాంగిరేసుకు తకతకాల!

పొయినతడవ మీకు పొరపాటుజర్గారు
మేల్లోవేసినారు ఓట్లుకాన
రామరావుమీద, రాజీవగాంధీపై
ఆలోచించుకొండి అక్కలార!

తెలుగుదేశమొస్తె తింతాఉబడుకారు
దిక్కుమొక్కు వుండు ఉక్కడాపె
పొయినతడవలాగె పొరపాటుబడకండి
ఆలోచించుకోండి అన్నలార!

### జనార్దనరెడ్డి

కత్తిలే బయ్యకాంగ్రేసు కధిసేత
మన జనార్దనుండు మచ్చుతునక
కుడిభుజమ్ము, వరిలోబద్ధ, పార్టీ
ప్రతిదిశ్రేష్ఠ వికట పాలిటీక్స్.

### రక్తదాత

తన్న నెత్తురంత పూళ్ళోళ్ళకిచ్చేసి
పావతీరకెళ్ళి పంచిపెట్టి
అమరజీవి చివికి తరిరె గోపీకృష్ణ
యింతలోనె యముడు గొంతుగోసె!

### ఆరెల్ రెడ్డి ట్రస్టు

మధ్యకాలంనుండు మరికాస్త వెంచాన్ని
కవికీనాడు కృతిని కవికరింది
అంతవరెదాక అదిమాకు పదివేలు
ఏక్కుపైనెరవు ఏమిజెయము?

---

### జనవాణి

(3 వ పేజీ తరువాయి)

---

## కాంగ్రెస్ సమాధికి రాళ్లెత్తిన వారెవరు?

పి. వి., కోట్ల, వై. ఎస్. కాసు. ఎందరో మహానుభావులు, అందరికీ వందనాలు. అందరూ తలా ఒక రాయి ఎత్తినవారే కాంగ్రెస్ సమాధికి! తమ స్వార్థంకోసం, తమ సన్నిహితులు, అను చరుల బంధువులకోసం, ఎవరికివారు పెత్తనం చెలాయించడంకోసం, రాష్ట్రంలో కాంగ్రెసును భ్రష్టు పట్టించారు అనాడు ముఖ్యమంత్రులను తోలు బొమ్మలమాదిరి ఆడించి, ప్రజలచేత ఛీ కొట్టించుకొని, చేటగాడో అటగాడో ఎవరైనాసరే, ఈ కాంగ్రెసుకంటే నయం అనిపించి, కాంగ్రెసును సర్వనాశనం చేశారు. ఈనాడు మళ్లీ ఊరూపేరూ తెలియని అనామకుల్ని అభ్యర్థులుగా నిర్ణయించి మరొకసారి కాంగ్రెసును భూస్థాపితం చేస్తున్నారు.

పైగా అధికారికంగా నిర్ణయించబడిన అభ్యర్థులను నామినేషన్ వెయ్యనివ్వకుండా అడ్డగించినవారి అభ్యర్థిత్వాలను ఖరారుచేయడం ఎంత దిగజారారు? అధిష్ఠానవర్గం నిర్ణయించిన అభ్యర్థులు పోటీ నుండి స్వయంగా విరమించుకునేపరిస్థితి కల్గడం ఎంతలోచనీయం! కాంగ్రెస్ అభ్యర్థులపై కాంగ్రెస్‌వారే పోటీకి తయారుకావడం ఎంత సిగ్గుచేటు! ముఠా కొట్లాటలతో పార్టీని ఈ దుస్థితికి దిగజార్చిన ఘనులందరిపేర్లను కాంగ్రెసు సమాధి శిలాఫలకంమీద అందంగా చెక్కించినవాళ్ళ ఋణం తీర్చుకోండి.

కావలి — సి, వెంకటరావు,

## ఇదెక్కడిన్యాయం?

ఎన్ని పడిపోతున్న కష్టాలలోనైతం కాంగ్రెసులోవుండి, ఇందిరా గాంధీని త్రికరణశుద్ధిగా బలపరచిన శ్రీ ఎన్. జనార్దనరెడ్డికి కాంగ్రెస్‌టికెట్ ఇవ్వకపోవడం దారుణం. రాష్ట్రంలో ఇందిరాకాంగ్రెసు మూలస్తంభాలలో జనార్దనరెడ్డి ఒకరు, అధికారంలోవున్నప్పుడు కాంగ్రెసు చీలపేరి, అధికారం లేనప్పుడు కాంగ్రెసుకు దూరమయ్యే అవకాశవాదం ఆయనలో ఏకోశానాలేదు, పదవులకోసం పార్టీలుమార్చే నీతిమాలిన రాజకీయం ఆయన ఏనాడూ ఎరగడు. నెల్లూరు, చిత్తూరు, ఒంగోలు జిల్లాలలో కాంగ్రెస్ ఐకి ఆయన నాయకత్వం ఎంతో ఉత్సాహాన్ని ఉత్తేజాన్ని కల్గించింది ఓటమిలోకూడా ఉదాత్తత వహించిన వారాయన.

అటువంటి నాయకునికి కాంగ్రెసు అన్యాయం చేసిందంటే ఇంతకన్నా హేయమైన విషయం మరొకటుంటుందా? ఈ పొరపాటును కాంగ్రెస్‌పార్టీ సరిదిద్దుకొనగలదని ఆశిస్తున్నాము.

కలిచేడు -ఎస్ మహబూబ్‌బాషా

---

### మేము మీకు

(3 వ పేజీ తరువాయి)

---

చేస్తుండిన మా పూర్వీకులలో ఒకాయన నిత్యం కొండవలూరువెళ్ళి, అక్కడి రెడ్డి రాజుల వివంతుసోదరి నాగమ్మకు మాపురాణం చెప్తుండేవాడట. నెల పొడవునా పురాణం విన్న నాగమ్మ అన్నగారిచేత తమ ఏలుబడిలోని కొంత భూమి వి. దాదాపు 1060 ఎకరాలు- ఆ బ్రాహ్మణునికి దానం చేసిందట, ఆమె పేరుమీదనే ఈ ప్రాంతం నాగమాంబాపురంగా పిలువబడుతున్నదని అంటారు.

—కాళహస్తి లక్ష్మీకాంతశర్మ
నాగమాంబాపురం

---

# పంచాంగం

---

### మహాశివరాత్రి

17-2-1985 తేది ఆదివారం మహా శివరాత్రి.

### ముహూర్తములు

మార్చి 21, 22, 24, 27 తేదులలో వివాహములు మరియు గృహవాస్తు శుభకార్యములు ఆచరించవచ్చును.

### ఫిబ్రవరి తిథులు

16 శని ద్వాదశి రా. 10-39 గం. వ.
17 ఆది త్రయోదశి రా. 10-14 గం.వ.
18 సోమ చతుర్దశి రా. 10-22 గం.వ.
19 మంగళ అమావాస్య
రాత్రి 10-58 గం. వ.
20 బుధ ఫాల్గుణ శుద్ధ పాడ్యమి
రా. 12-22 గం. వ.
21 గురు విదియ రా. 1-58 గం. వ.
22 శుక్ర తదియ రా. 3-41 గం. వ.

—నిమ్మగడ్డ వేంకటేశ్వరశాస్త్రి


మద్రాసులో నెల్లూరువారి
రుచి శుచి మేళవించిన పసందైన
మాంసాహార భోజనం

# హోటల్ శ్రీ కల్యాణి

**12/1 గ్రీమ్స్ రోడ్**
'అపోలో' ఆసుపత్రి దగ్గరలో
మద్రాసు 600 006

మద్రాసు వచ్చినపుడు ఒక్కసారి విచ్చేసి
మా ఆతిథ్యాన్ని స్వీకరించండి !
మళ్ళీ, మళ్ళీ మీరే వస్తారు !!

# ** పెండ్లిండ్లు **

పెళ్ళిళ్ళ సీజను ఒకింత దాగి వెనక బడి పోయింది. ఎప్పటికప్పుడు ఏవో అవాంతరాలు. వినాయకుడి పెళ్ళికి అన్నీ విఘ్నాలే వచ్చినట్లు, ఈ పెళ్ళిళ్ళ కీర్తికరూ అన్నీ అడ్డంకులే. ఏ తుఫానో, ఏ గాలివానో, కరువో కాటకమో వస్తే ఈ కీర్తిక మునిగిపోతుంది. అట్లానే ఏ ఎన్నికలో వచ్చినా ఈ కీర్తిక కొట్టుకపోతుంది. నవంబరు, డిసెంబరు నెలలనాటి పెళ్ళిళ్ళు కూడా లెక్కవేస్తున్నాము. ఒక మిత్రుడన్నాడు ఇలా - 'మీరు పెళ్ళిళ్ళనుగూర్చి రాసేలోగా ఆ దంపతులకు బిడ్డలు కూడా పుట్టేస్తారు' అన్నాడు. నిజమే అంత ఆలస్యమైపోతుంది కీర్తిక. ఆలస్యానికి మన్నించాల్సిందిగా కోరుకుంటూ, శుభవార్తాప్రకటనం ప్రారంభిస్తున్నాము.

నవంబరు వివాహాలు-

### ఉషారాణి : శ్రీనివాసులు

శ్రీకాళహస్తి పేట శ్రీ వేమన మునయ్య కుమార్తె ఉషారాణి; నెల్లూరువాసి శ్రీ అచ్యుత వెంకటరమణయ్య కుమారుడు, బి.ఎస్‌సి పట్టభద్రుడు శ్రీనివాసులు కల్యాణం 11 తేదీ నవాబుపేట దుండూరు అమ్మణ్ణమ్మ కల్యాణ నిలయంలో జరిగింది.

### చంద్రవదన- సుబ్బయ్యనాయుడు

బూచనేత శ్రీ చేకవోలు గోపాలయ్య నాయుడు తమ్ముడు, బి. కాం. బి. ఇడి. పట్టభద్రుడు సుబ్బయ్యనాయుడు, నాయుడు పేట తాలూకా పెన్నేపల్లి. వ్యక్తియ పెన్నేపల్లి వెంకుపాటయ్య కుమార్తె చంద్రవదన వివాహం 29 తేదీ గూడూరు వరలక్ష్మి టాకీస్‌లో జరిగింది.

జనవరి కల్యాణాలు-

### మునిసిపల్ పెళ్ళి

మునిసిపల్ కౌన్సిలర్- శ్రీ ఉదయగిరి నరసింహులుగౌడ్ సోదరుడు వెంకటేశ్వరరావు; ఆన్నారెడ్డిపాళెం శ్రీ కొడ్డోలు రమణయ్య కుమార్తె లక్ష్మీ ప్రసూన వివాహం 31 తేదీ టౌనుహాల్లో జరిగింది.

డిసెంబరు పెళ్ళిళ్ళు-

### వినయ : మురళీధర్

ఎ. వి. సుబ్బారెడ్డిగారి చిన్నల్లుడు శ్రీ బిళదవోలు శ్రీనివాసులురెడ్డి కుమార్తె వినయ; కడప శ్రీ వి. గంగిరెడ్డి కుమారుడు మురళీధర్ వివాహం 9 తేదీ నెల్లూరు వెంకటేశ్వర కళ్యాణ మండపంలో జరిగింది.

### లాయర్ల వియ్యం

నెల్లూరు న్యాయవాది శ్రీ చిల్లకూరు సుందరరామరెడ్డి కుమార్తె సుధీర; కోవూరు మార్కెట్యార్డులాయర్ శ్రీ ఎస్. ఎల్. వి రమణారెడ్డి కుమారుడు హరిప్రసాద్‌రెడ్డి కళ్యాణం 9 తేదీ టౌనుహాల్లో జరిగింది.

### విజయలక్ష్మి - శ్రీనివాసులు

నెల్లూరు- శ్రీనివాస జ్యూవలరీయుడు శ్రీ గుమ్మిడేల వెంకటేశ్వర్లు సోదరి విజయలక్ష్మి; శ్రీ దర్శి కాశయ్య కుమారుడు శ్రీనివాసుల పెళ్ళి 9 తేదీ క్లాత్ మర్చెంట్స్ అసోసియేషన్ హాల్లో జరిగింది

### జబల్‌పూర్ పెండ్లి

గోగినేనిపురం మైకా కీర్తిసంపదలతో దగద్దాయమానంగా ప్రకాశిస్తుండిన రోజులలో అక్కడ అకౌంటెంటుగా పని చేసిన నన్నూరయమిత్రుడు; గుంటూరు జిల్లావాసి; ప్రస్తుతం జబల్‌పూర్‌లో కాంట్రాక్టరుగా కాలోలు స్థిరపడిన శ్రీ కరణం రామమూర్తి కుమార్తె ఛాయ; కట్నివాసి వక్రీరు శంకరరావ్ కుమారుడు ఓంప్రకాష్ పరిణయం 8 తేదీ జబల్‌పూర్‌లో జరిగింది.

కులాంతర, రాష్ట్రాంతర, భాషాంతర సంబంధంగా పున్నట్లుగా వుంది. ఆదర్శ వంతమైంది.

### శ్రీనివాసశర్మ - పంకజాక్షి

నెల్లూరు స్టేట్ బ్యాంకు ఆఫీసరు శ్రీ వసుమర్తి శివరామయ్య సోదరుడు శ్రీనివాసశర్మ; పొన్నేరితాలూకా మురిచెంబేడు శ్రీ చివుకుల సుబ్బరేశం కుమార్తె పంకజాక్షి కళ్యాణం 2 తేదీ మద్రాసులో జరిగింది.

ఫిబ్రవరి పరిణయాలు-

### ఎస్. పి. కుమార్తె

నెల్లూరులో పోలీసు సూపరింటెండెంట్‌గా చేసిపోయిన సౌజన్యమూర్తి శ్రీ ఎ. హనుమంతరెడ్డి కుమార్తె మృదుల; కడపలవారిపల్లె శ్రీ కె వి. రామకృష్ణారెడ్డి కుమారుడు శ్రీకాంత్‌రెడ్డి వివాహం 10 తేదీ అనంతపురం వత్సా సాయి కల్యాణమండపంలో జరిగింది.

### అపర్ణ _ మురళీమోహన్

ప్రకాశంజిల్లా అర్థవీడు ప్రభుత్వ జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్‌గా ఉన్న నెల్లూరు మిత్రుడు శ్రీ ఈశ్వరకవి బాలకృష్ణమూర్తి కుమార్తె అపర్ణ; గూడూరు డివిజనల్ పంచాయితీ ఆఫీసరు శ్రీ మండిరాజు శ్రీహరిరావు కుమారుడు, ఇంజనీరు వెంకటమురళీమోహన్ వివాహం జనవరి 31 తేదీ పాండురంగ అన్నదాన సమాజంలో జరిగింది.

### దొడ్ల కళ్యాణం

బుచ్చిరెడ్డిపాళెం శ్రీ దొడ్ల అన్నారెడ్డి కుమారుడు రంగారెడ్డి, రాజవోలు శ్రీ చిట్టమూరు వెంకటశేషారెడ్డి కుమార్తె వాణి కళ్యాణం 13 తేదీ నెల్లూరు టి.టి.డి. కళ్యాణమంటపంలో జరిగింది.

### సీతామహాలక్ష్మి సుధాకరరావు

సత్యజనమిత్రుడు, విష్కవటి శ్రీ కొర్లగుంట రమణయ్యచౌదరి కుమార్తె సీతామహాలక్ష్మి; వింజమూరు తాలూకా కోవివారిపల్లె శ్రీ కోవి వెంచురామానాయుడు కుమారుడు బి. కామ్, బి. ఎల్. పట్టభద్రుడు సుధాకరరావు వివాహం 10 తేదీ నెల్లూరు క్లాత్‌మర్చెంట్స్ అసోసియేషన్ హాల్లో జరిగింది.

### అమరా కళ్యాణం

లాయరు వృత్తి వదలి వ్యాపారంలో దక్షత నార్జించిన చెన్నూరు- శ్రీ అమరా దశరథరామయ్య కుమార్తె శోభశ్రీకుమారి; బద్వేలి- శ్రీ గుడుగుంట్ల సుబ్రహ్మణ్యం కుమారుడు ఎం. కామ్. పట్టభద్రుడు చంద్రమోహన్ వివాహం 8 తేదీ చెన్నూరులో జరిగింది.

### శ్రీనివాసరావు - షర్మిలాదేవి

హరిజన నాయకుడు- పార్లమెంటు సభ్యుడుగా వివాదరహితుడు స్వర్గీయ దొడ్డవరపు కామాక్షయ్య కుమారుడు- అంబేద్కర్ సంస్కార యుక్తుడైన డాక్టర్ ప్రభాకరరావుగారి సోదరుడు శ్రీనివాసరావు; గవర్నర్ ప్రెస్ కార్యదర్శి ప్రతిభావంతుడైన పబ్లిక్ రిలేషన్స్ అధికారి శ్రీ టి. వి. పండరి కుమార్తె షర్మిలాదేవి కళ్యాణం జనవరి 31 తేదీ హైదరాబాద్ శ్రీ హైకోర్టు క్లబ్‌లో జరిగింది.

Prof. డా. ఎ. జె. శెల్వపాండ్యన్

B. SC., M. B. F. A. C. S., F. I. M. S. A. F. A. M. S.,

ORTHOPAEDIC AND HAND SURGEON

రాయవేలూరు ఆస్పత్రిలో ఎముకల పోలియో స్పెషలిస్ట్ డా. ఎ.జె. సెల్వపాండ్యన్‌గారు 28-2-85 తేదీ మంగళవారం వచ్చెదరు. పైవారిని చూడ గోరువారు ఈ క్రింది డాక్టర్ వారిని సంప్రదించవచ్చు.

బి. సి. ఆసుపత్రి
నెల్లూరు-524 001

డా. దేవరాజ్ పూల,
M.B., B.S., F.A C.T.M.

Jeep For Sale

Diesel Jeep 1973 Model Bearing No: AAQ 1881 Is available for sale in "as is where is" condition. It is presently stationed in the workshop of M. G. Brothers, Dargamitta, Nellore.

Interested parties may contact Manager,

M. G Brothers, Nellore.

వరి పరిశోధనా స్థానము; నెల్లూరు

వేలం ప్రకటన

వరి పరిశోధనా స్థానము నెల్లూరునందు 22-2-85 తేదీ మధ్యాహ్నము 3 గంటలకు 10 నిముషములలోపు ఎండుగడ్డి, పాత రైతుబండి, పాత రైతు మినను, పాత స్ప్రేయరు వగైరా సామానులు బహిరంగ వేలం వేయబడును. వివరములకు సంప్రదించండి.

అసిస్టెంటు రైస్ స్పెషలిస్టు

అగ్రికల్చరల్ రిసెర్చి స్టేషన్, (పాత పింగాణి ఫ్యాక్టరీ దగ్గర) ముత్తుకూరు రోడ్డు – నెల్లూరు.

### కవిత్రయ జయంతులు

(4 వ పేజీ తరువాయి)

పరిమితమైపోయాయా అనిపిస్తూంది. ఈ వాదనైతే దేశ్శలో ఏ ఇద్దరున్నూ గుర్తింపని, అందరూ ఆ సోపానికి చెందిన వండితులే పాల్గొన్నారు.

ఈసంవత్సరంకూడా అంతేజయింది. వసుమర్రాల లక్ష్మయ్యగారు పాతవద్దతిలో సంస్కృతాంధ్ర మహాభారత తులనాత్మక పరిశీలనం టూ ప్రారంభించి, వ్యాఖ్యానవ్యాఖ్యంగా దాటవేశారు. సంస్కృత భారతానికి నన్నయ అనవసరమైన చోట మార్పులు, చేర్పులు, కూర్పులు చేశాడంటూ, ధర్మాధర్మ విరూపణమే భారత రచనకు మూలకారణమన్నారు నన్నయ కవిత్వం సంస్కృత భూయిష్ఠ మనటం సరికాదని, తెలుగు జాతీయాలకూడా విరివిగా వాడాడని అంటూ, శకుంతలో పాఖ్యానంలో సంస్కృతంలో 'సత్యమేవ విశిష్యతే' అంటే, దాన్ని నన్నయ 'సత్యమునంతవ నులునూవు గౌరవంబున పేర్మిగా' అన్నాడని; 'ములనూవు' అనే జాతీయం వాడాడని లక్ష్మయ్య ఉదహరించారు.

ఐతే ఇక్కడ మనకొంటువు వచ్చే సందేహం- అక్కడక్కడా కనదగిలే జాతీయాలను ఏరి, నన్నయ రచనంతా తెలుగు నుడికారమే వనడం న్యాయమా- అని!

సంస్కృతభారతంలో శిశుపాలవధ ఘట్టంలో భీష్ముణ్ణి స్తుతిస్తూ "వేదతత్త్వవ భీష్మమహ" అని ఒక్కమాటలో ముగిస్తే నన్నయ "ఆదిజాదైన బ్రహ్మాయుదయంబున శాశ్వతమైనవాడు.." అని విపులీకరించాడు. అవసరమైనచోట పెంచటం, అనుచితమైన శాఖన తుంచడం పాటించిన వాడు నన్నయ- అన్నారు లక్ష్మయ్యగారు.

మరొక విశేషం- శుక్రాచార్యులు మద్యం సేవించవద్దన్నాడు గనుక, మద్య నిషేధం భారతంలోనే ఉందని; దేవయాని అలోజనం చనిపంది గనుక నిరాహార దీక్షకూడా మహాభారతంలోనే ఉందని; శిశుపాలుడు సభనుంచి నిష్క్రమించాడు గనుక 'అసెంబ్లీ వాకౌట్' కూడా మహాభారతంనాటిదేనని లక్ష్మయ్యగారు ఆధునికీకరించబోయారు. బాగుంటేకదూ!

నన్నయ ప్రసన్నకథాకలితార్థయుక్తి సూక్తి వైచిత్రి వగైరా పాతపాట లక్ష్మయ్యగారు యథావిధిగా పాడారు.

రెండోరోజు ఎర్రన జయంతిలో శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి రామరాజభూషణుని వసుచరిత్రమును గూర్చి ప్రసంగించారు.

రామరాజభూషణుడు తెలంగాణా ప్రాంతీయుడు కావచ్చునన్నారాయన. ఐతే అందుకాయన ఏమంత చారిత్రక ఆధారాలు చూపలేదు. తెలంగాణాలో భట్టువారిపల్లె అనే ఊరుంది; కాబట్టి రామరాజభూషణుడు తెలంగాణావాడంటూ రాయన, కోశే 'సుకవి కులాబ్ధి పొడసూపిన." అంటూ ఒక చాటువుందని; అందులో "నీ వసుచర్య చూడగ జరిగె నిగూఢ వృత్తి" అని వుంది; అది రామభూషణుడిలాకే గిట్టనివారు చెప్పింది వుంటుందని అనుకున్నాడు. ఐతే ఆ చాటువులోని 'వసుచర్య'కు వసుచరిత్ర అనే అర్థం ఎందుకు తీసుకోవాలో ఆయన చెప్పలేదు.

వసుచరిత్రలో కథాసూత్రం లేదనడం రావ్యంకాదన్నారు నరసింహశాస్త్రిగారు, ఎట్లాభావ్యంకాదో, కథాసూత్రం ఎక్కడ ఉందో విడమరచి చెప్పలేదు. వసుచరిత్ర ఎవరికీ అర్థంకాదనే అపవాదు వుందని అంటూ [illegible] ఎవరికి అర్థం [illegible]తో వాళ్ళే చదువుకొంటారని చెప్పిచెప్పేవారు ఎకసక్కెంచందం గౌరవం తీసుకరావాలనే ఉద్దేశ్యంతో రామరాజభూషణుడు ప్రబంధం రాశాడని; అందులోని వర్ణనలు అర్థంచేసుకుంటేగానీ దాని గొప్పతనం తెలియదని అన్నారు. అందుకేవో కొన్ని ఉదాహరణలు చెప్పి ముగించారు. మొత్తమ్మీద ఆయన ప్రసంగం నిరాసక్తంగా సాగింది.

తిక్కన జయంతిలో శ్రీ బండ్ల వేంకట రమణయ్య అసాధారణ ధారణతో పద్యాలు గడగడా చదవడమైతే బాగుంది కానీ, తిక్కన కవితాశైలిని కొత్త అవగాహనతో విశ్లేషించడం మాత్రం జరగలేదు తిక్కన వాడిన జాతీయాలను ఉదహరిస్తూ, అంత, ఇంత, అ, ఈ అనే పదాలను తిక్కన తరచు ఉపయోగించాడన్నారు. "అంతలు సేసి రోనదచి యక్కటా నంజయుచేత పుత్తెంతురే". అంత అనే చిన్నమాటలో ఎంతోభావం ఇమిడ్చాడు. 'ఆ సభకేకవవు మై' అంటాడు. ఆ లో అంతగొప్పసభ అనే అర్థం స్ఫురింపజేశాడు.

భగవద్గీతలో 'వాసాంసి జీర్ణాని యథా విహాయ' అనే శ్లోకాన్ని అచ్చమైన తెలుగు నుడికారంతో 'ఒక యింటి నుండి వేరొక యింటికి' పోయినవిధంగా "వస్త్రంబురించి వేరొకవస్త్రంబు.." ధరించిన విధంగా జనన మరణాలు సంభవిస్తాయంటాడు, అన్నారు రమణయ్య

తిక్కన జాతీయాలకు కొన్ని ఉదాహరించారు రమణయ్యగారు-

శాంతిపర్వంలో గోవును 'నడుగరివాని'గా వర్ణిస్తాడు. అంటే నాలుగుకాళ్ల జంతువు అని అర్థం. సౌప్తికపర్వంలో, అప్పుడున్న శత్రువులను తెగటార్చక, తెగటార్చక వదలనాడంటాడు. 'కాదుక మరకతలచిపట్లు'; 'కుండలు వాముట' వగైరా జాతీయాలను వాడతాడు.

—ఈ ధోరణిలో సాగింది రమణయ్యగారి ప్రసంగం.

మొత్తమ్మీద ఈ మూడు సభల్లో భాషా విషయంగా చర్చ జరిగిందేకానీ, కవిత్వతత్వాన్ని దర్శించే ప్రయత్నం జరగలేదు. అక్కడొకమాట, ఇక్కడొక ఘట్టం తీసుకొని తిక్కన ఎంత గొప్పగా వర్ణించాడు, నన్నయ ఎంత ఉదాత్తంగా అనువదించాడు అనే చర్చే తప్ప, మహాభారతరచన మూలాలను అందుకొని, ఏ లక్ష్యనున్నుద్దేశించి కావ్యరచన సాగిందీ, దాని నేపథ్యం ఏమిటీ, ఏ సాంఘిక పరిస్థితుల ప్రభావం ఈ రచనపై ఉంది వివరించడం జరగలేదు. వసుచరిత్రను గూర్చికూడా అంతే. ఇందువల్లనే ఈ జయంతులు సమగ్రతను సంతరించుకోలేక పోతున్నాయి; కొత్తదనాన్ని కల్పించలేకపోతున్నాయి. ఒక కాస్త మైన అనుగ్రహంతో మహాభారతరచనవేళ, అందులో ప్రతిపాదించిన అనేకానేక సామాజిక విషయాల నేపథ్యాన్ని గూడా విశ్లేషించే ప్రయత్నం జరిగినట్లే ఈ కవిత్రయ జయంతులు ప్రయోజనకరంగా సాగవు. అట్లాకాకుండా ఏదో నామమాత్రంగా పాతవిషయాల్నే- ఆ నన్నయ ప్రసన్నకథాకలితార్థయుక్తి, ఆ తిక్కన తెలుగు నుడికారం వగైరాలే పునశ్చరణ చేసుకొందాం చాలు అనుకుంటే- ఇక దాన్నిగూర్చి మనం చెప్పుకోవలసిందేమీలేదు.

—



దేశ నేత 'రాజీవ్'

దేశమాత ఇందిరాగాంధీ

అడుగుజాడలలో నడచి

ఉదయగిరి చీకటి కోనలలో వెలుగులు విరజిమ్మాలంటే

యువకుడు, ఉత్సాహవంతుడు, నిజాయితీపరుడు

ఉదయగిరి అసెంబ్లీ నియోజకవర్గ ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థి



# యం. రాజమోహన్ రెడ్డి బి. ఇ. గారికి



## హస్తం గుర్తుపై



మీ పవిత్రమైన ఓటు ముద్రవేసి అత్యధిక మెజారిటీతో

గెలిపించ ప్రార్థన.

ఉదయగిరి అసెంబ్లీ నియోజకవర్గ

ఇందిరా కాంగ్రెస్ ఎన్నికల ప్రచార సంఘం

---



తెలుగుదేశం గెలుపు
సామాన్యుల
జీవితాలలో
కొత్తమలుపు

తెలుగు ప్రజల జీవితాలలో

కొత్త ఆశలు రేకెత్తించిన

ప్రజానాయకుడు

## నందమూరి తారకరామారావు



ఆశీర్వాదంతో,

రాపూరు అసెంబ్లీ నియోజకవర్గం

తెలుగుదేశం అభ్యర్థిగా పోటీ చేస్తున్న

యువతరం ప్రతినిధి, నీతి నిజాయితీలకు ప్రతిరూపం

# ఆనం రామనారాయణరెడ్డికి

అఖండ విజయం చేకూర్చ ప్రార్థన.





-బెజవాడ ఖరణీరెడ్డి
కొండ్లపూడి.

Edited, Printed & Published by N. Sree Ramamurthy at The Zamin Ryot Press, Thipparajuvari Street, Nellore (A. P.)